కళాప్రపూర్ణ నాటకపరంపర :

# నాటక నాటకము

లేక

# బొర్రయ్యాసెట్టి



కర్త :

# నాటక నాటకము

లేక

# భార్యయ్యాసెట్టి

(హాస్య నాటిక)



మహోపాధ్యాయ కళాప్రపూర్ణ

డాక్టరు : చిలుకూరి నారాయణరావుగారు,

ఎమ్. ఏ., పి. ఎచ్. డి., ఎల్. టి.,

అనంతపురము.

1949.

# మనవి

"నారాయణరావుగారూ! మీరు భాషాచరిత్రం, వాఙ్మయచరిత్రం, దేశచరిత్రం, రాయూరప్పలచరిత్రం— ఇటువంటివి కొన్నాళ్లు కట్టిపెట్టి, నాటకాలు వ్రాస్తే బాగుంటుం దండీ! 'మీ మొండిశిఖండి', 'అశ్వత్థామ', 'అచ్చి', 'పెండ్లి'– ఆంధ్రదేశములో నూ...ంచి ప్రచారానికి వచ్చాయి. ఇంకా కొన్ని అటువంటివి వ్రాసినారట, ఆడించినారట. చూచిన వాళ్లు చాలా మెచ్చుకొన్నారట. మరి ఆ నాటకాలనుకూడా అచ్చువేసి, ఆంధ్రుల కానందం కలుగజేయరూ!" అని కనబడినవారందరున్నూ అనడమే. ఏదో, నా సరదాకోసం వ్రాసుకొన్న యీనాటకాలను రచ్చకెక్కించి, నామట్టుకు నేను భూషించుకొంటూ ఉన్నవాటిని ఓర్వలేనివాళ్లు దూషించే టట్టుగా ఎందుకు చేయవలెనని ఇన్నాళ్లూ ఊరకొన్నాను. అయితే, నాశిష్యులూ, నాస్నేహితులూ ఊరుకోరు. అచ్చు వేయక తీరదంటారు. ఏమిచేయను! అచ్చువేశాను. ఇక వాళ్లయిష్టం! ఆనందించగలవాళ్లానందించండి.

నమో మహద్భ్యః!...నమో రసిజకనేభ్యః!!

---

# కళ్ళాప్రపూర్ణుని ఇతరనాటకములు

| | | |
|---|---|---|
| అంబ లేక మొండిశిఖండి | ... | 0–12–0 |
| అత్రి లేక కాపువలపు | ... | 0–12–0 |
| అశ్వత్థామ | ... | 0–8– 0 |
| పెండ్లి | ... | 0–8– 0 |
| నందుడు | ... | 0–12–0 |
| బొమ్మపొత్తికలు | ... | 0–6– 0 |
| వాడే (పరిశోధననాటకము) | ... | 0–12–0 |
| ఆకలి (అచ్చులో ఉన్నది) | | |

# నాటక నాటకము.

---

## ప్రథమరంగము.

(సూత్రధారుడు ప్రవేశిస్తాడు.)

సూత్ర:—(పాట.)

శ్రీ
శ్రీ
శ్రీ
శ్రీ

రాజగో-పాలూడా

రావయో-నాముద్దు-రాజ

నటీ, అలంకరించుకొనుట యైనచో నొకసారి యిటు రమ్ము.

నటి:—(క్రాపింగుతల, కోటు, మొగానికి సగము పౌడరు, పంచెమీద చీర) ఏమిరా, సుబ్బూ! ఏమిటి నీతొందర? ఇంకా నేను డ్రెస్సు చేసుకోకుండానే పిలిచేస్తే ఎట్లా వచ్చేది? వీండ్లందరిచేతా చప్పట్లు కొట్టించుకోమన్నావా?

సూత్ర:—నన్నేమి చేయమన్నావు బొర్రయ్యసెట్టి వెనకనుంచి ముందుకు తోస్తూ ఉంటే?

నటి:—బొర్రయ్యసెట్టి యెవడోయ్ ? నాటక మాడేవాళ్లం మనమా, బొర్రయ్యసెట్టా ?

సూత్ర:—సెట్టి వెయ్యిరూపాయల కీనాటకం కంట్రాక్టుకు తీసుకొన్నాడు. ఈదినం రెండువేలకు టిక్కట్లు అమ్మినాడు. హాలంతా కిటకిట లాడిపోతున్నది.

నటి:—ఆడిపోతే మన కేమి ? వేషాలు వేసుకోనిదే స్టేజిమీది కెట్లా రావడం ?...నువ్వేమిమొగం పెట్టుకొని వచ్చినావు ?

సూత్ర:—వేషం వేసుకోవడ మెవరిది తప్పు ? నిక్కీ, నీలిగీ, ఇప్పుడువస్తే, వేషం వేసుకోవడ మెట్లా పూర్తి అవుతుందనుకొన్నావు ? నన్నుచూడు...వేళకు వచ్చేశాను. వేషం వేసేసుకొన్నాను. సిద్ధమయినాను.

నటి:—నీమొహం సిద్ధమయినావు ! నిన్నుచూచి వీండ్లందరూ చప్పట్లు కొట్టుతూ ఉన్నా పోల్చుకోలేకుండా ఉన్నావు. ఫూల్ !

సూత్ర:—మాటలు తిన్నగా రానీ ! దవడపళ్లు రాలగొట్టగలను.

నటి:—బాగున్నావులే, బొంబాయి బోండాలాగు తలకాయూ నువ్వున్నూ.

సూత్ర:—నీ తలకాయమాత్రం ! ఊడదీసిన మంచంకోడు లాగ లేదూ ?...ఒకే, హనుమేశ్ ! ఒకటి చెప్తాను,

నామాట వినుకో. ఇక్కడికి మనము నాటక మాడ డానికి వచ్చినాము గాని, ఒకరి నొకరము తిట్టుకొన డానికి రాలేదు. మన కెందుకు? మనపార్టు మన మొప్ప జెప్పేసి దిగిపోదాము. బొర్రయ్యసెట్టి మనకివ్వడాని కొప్పుకొన్న చెరి యాభై రూపాయలు లాక్కొని పోదాము. మనపార్టయినతరువాత సెట్టి గంగలోని కురుకుతే మన కేమి? నడిమివంకలోని కురుకుతే మన కేమి?

నటి:—నువ్వుచెప్పిన మాట బాగానే ఉంది. కొంచెము సంగీతం కానిస్తూ ఉండు. ఇప్పుడే చీరకట్టుకొని వచ్చేస్తాను.

సూత్ర:—మరి పోయి బిరీని రా.

(నటి నిష్క్రమి.)

సూత్ర:—వీళ్ల చాదస్తం కాలా! ఎంతసేపటికిన్ని తయారు కారు! పాడుతాను:

పల్లవి

ఆహా యీసభ-ఆశ్చర్యమాయెను

అనుపల్లవి

ఈ అల్లరి అంతా-ఈసడిం-పాయెను-ఆహా!

చరణము

ఫీ్రి-టి-క్కెట్ల వారు-పిలుపులేక వచ్చినవారు
ముందటి-సీట్లకోసం-మోచేత పొడిచేవారు-ఆహా!

ఒక నటుడు:—(వేగముగా ప్రవేశించి) ఒరే బొజ్జయ్యా! ఏమిటిరా పాడుతున్నావూ? బొంద్రయ్యసెట్టి నీపాట విని, నిన్ను ఉన్నపాటుగా ఈడ్చుకరమ్మని నన్ను పంపినాడు.

సూత్ర:—(కోపముతో) నేను రానని చెప్పు. పో! నాపార్టు చెప్పుతూ ఉంటే, నువ్వెందుకొచ్చినావు పానకములోని పుడకలాగ?

నటు:—అయితే నువ్వు రానన్నావని సెట్టితో చెప్పనా?

సూత్ర:—చెప్పుకో, చెప్పుకో, చెవులూ ముక్కూ కోయించుకో!

నటు:—ఉండు నీపని చెప్తాను. (పోతాడు.)

సూత్ర:—ఏహేఁ! ఈ బొజ్జయ్యసంగతి వీళ్లకేమి తెలుసు? నన్ని స్టేజిమీద నుంచి దింపడానికి కొండమీదికోతి దిగి రావాలి.

ఒక నటుడు:—(వెనుకనుంచి ప్రవేశించి, సూత్రధారుని తల మీది రుమాల చప్పున ఊడదీసి, చంకను పెట్టుకొని) ఏమిరా, తుంబయ్యా, నీకేమైనా బుద్ధి ఉందా, లేదా? నేను నాయకుడిపార్టు వేసుకోవలెనని పట్టు రుమాలా, చెమ్కీకోటూ తెచ్చుకొంటే, అవి తొడిగేసుకొని వచ్చేస్తావా? మొదటి అంకములోనే నేను ప్రవేశిం

చాలికదా, ఎట్లా ప్రవేశిస్తా ననుకొన్నావు?...తే! ఆకోటు విప్పు!...ఇక్కడపెట్టు!

సూత్ర:—నన్నిందరిముందరా అవమానం చేస్తావా? నే నీ కోటిచ్చేదిలేదు. నీ దిక్కున్నదగ్గర చెప్పుకో!

నటు:—ఓరీ పిడుగా! హీరోయిన్ కట్టుకోవలసిన చీరకూడా తీసుకొని నడుముకు చుట్టుకొన్నావటరా? హీరోయినుని పిలుస్తానుండు....కాంతారత్నమా! ఎంతకష్ట మెంత కష్టము! ప్రియురాలా, చూచితివా, ఈపొట్టయ్య కావించి, ఒనరించిన దుండగము? రమ్ము!...వేగము రమ్ము!! నీచీర నీదుష్టనిశాచరు డపహరించినాడు! పాపము! నీవు వస్త్రహీనవై యెట్లు నటింపగలవు? రమ్ము, నరకాసురునకు సత్యభామవలె నాకు తోడ్పడుము!!

సూత్ర:—నరకాసురుడికి సత్యభామ తోడ్పడడ మేమిటిరా, ఈడియట్!

నటు:—ఎవడురా ఈడియట్టూ! నువ్వు ఈడియట్టు, నీయబ్బ ఈడియట్టు: నీమామ పోగచుట్, నీబావ ఫట్, ఫట్! ముందు కోటూ, చీరాతీసి ఇవతలపెట్!!

సూత్ర:—పోరా, అనిమిగా! నే నిచ్చేదిలేదు! ఏమిచేస్తావో చేసుకో!

(హీరోయిను నటుడు ప్రవేశము.
ఫిమేలు విగ్గు, రవిక, పంచెతో)

హీరోయిన్ :—ఏడీనాథా! ఏడనున్నాఁడా కష్ట, నష్ట, దుష్ట, భ్రష్ట, కనిష్ఠ రాక్షసాధముఁడు? నా వాగ్బాణముల కాహుతిగానున్న ఆ అవాచ్యుఁడు? ఓరీ, అధమాధముండా! ముండాయమాన నటశేఖరరిపుండా! పుండరీకావాసిత కొండా! రా, రండా! ఎవరెవరు వస్తారో!— నా యమూల్యదుకూలంబును, నా వన్నెలవిసనకర్ర సారీ నోరీ! కాజేస్తావటరా? ఈ నాముద్దుల మగని చెమ్కీకోటును చెప్పకుండా తొడుగుకొని వచ్చేస్తావటరా? పెట్టు! ఇక్కడ పెట్టు!!

సూత్ర :—పోరా, హీరోయిన్ గాడా! నే నెవడనో తెలుసునా?...ఎహే! నేను సూత్రధారుడిని.

నటు:—సూత్రధారుడవో, గాత్రధారుడవో! ముందు నా కోటిక్కడపెట్టు!

సూత్ర :—ఏమి, ఈకోటు నీయబ్బగంటూ? బొర్రయ్యసెట్టితో చెప్పి తెచ్చుకొన్నాను. పోయి, సెట్టి నడుగుకోండి.

హీరోయిన్ :—సెట్టీలేదు, గిట్టీలేదు.—నాథా! వీనిని పట్టుకొనుము. నేనూడ బీకెదను. (హీరో పట్టుకొంటాడు. హీరోయిన్ లాగుకొంటాడు.)

నటుడు:—ఇంక చెప్పుకో, సెట్టితో చెప్పుకొంటావో, ఎవడితో చెప్పుకొంటావో.

హీరోయిన్:—ఇంక నీయేడ్పేదో యేడ్చుకో!

నటుడు, హీరోయిన్ పోతాడు.)

సూత్ర:—టకటకా! ఎంతకష్ట మెంతకష్టము! నాకటివేష్టన నష్టుడనై నడుము నటక్కుమనిపించుకొన్నాను కోటూ డబీకి చర్మ మొలిచినారు. శిరోవేష్టన మెగరగొట్టి శిరశ్ఛేదము చేసినారు నే నెవరితో చెప్పుకోగలను?

సీ. తరులార! బిరుసుబిత్తరులార! కరులార!
కనరాకో నాబాధ కన్నులార!
కిరులార! ఉక్కిబిక్కిడులార! దరులార!
వినరాకో నామొర వీనులార!
పరులార! గేటుకీపరులార! గిరులార!
తలఁపరే నాపాటు తలలతోడ!
సురలార! ఓసభాస్తరులార! గురులార!
ఊరకుందురె మీరు నురులతోడ!

ఛీ! పద్యం మరచిపోయినాను. కానీ! ఈ హీరోగాడికి హీరోయిన్‌గాడు సహాయమయినట్టు నా నటిగాడు నాకు సహాయంచేస్తాడో లేదో చూస్తాను...నటి చీర సింగారించుకొనేసరికి మాటుమణిగి పోయేటట్లున్నదే!—ఏమి, ప్రియురాలా, ఇంకను కాలేదా? నాయవస్థను తలంపవైతివే! ఏల రాకున్నావు? ఏల సన్నోదార్చవు? (ఏడుస్తాడు.)

(మరొక్క నటీవేషధారి ప్రవేశము, పంచె, షర్టుతో.)

2-నటి:—ఏమి నాథా! వెక్కి వెక్కి యేడ్చుచున్నవారలరు ?

సూత్ర:—నువ్వెవడవురా?—నానటిగా డేడీ ?

2-నటి:—వాడింకా వేషం వేసుకొంటున్నాడు. అందాకా నన్ను పంపినాడు.—నాథా! ఏల యేడ్చుచున్నవారలరు?

సూత్ర: —నువ్వుపో. వాడిని పంపు. నీతో నేను మాట్లాడను.

2-నటి:—అయ్యో, నాథా! మాట్లాడవా? నేనేమి యపరాధ మొనరించితిని ? మీ కష్టసుఖములు నావికావా? మీ యరణ్యరోదనమునకుం గల కారణమును దయయుంచి నాతో మనవిచేయుడు. నేను మీప్రేమంపు టిల్లాలను కానా ?

సూత్ర:—పోరా, శసిగా! నువ్వెక్కడనుంచి తగులుకొన్నావు నాకు ?

2-నటి:—నాథా ! నాప్రాణనాథా !

సూత్ర:—ఛీప్ ! నోరుముయ్ !

2-నటి:—అయ్యో, నన్నిట్లందరిలో పరాభవింప నగునా ? ఆహా ! (ఏడుస్తాడు.)

(1-నటి వేగముగా ప్రవేశము. చీర మాత్రము విగ్గులేదు )

1-నటి:—ఏమిరా. ఏడుస్తున్నావు ?

2-నటి:—నేను నటిని. నాప్రాణప్రియునితో సంభాషించుచున్నదానను. నీ వెవడవు—చీరకట్టుకొని తయారయినావు ?

1-నటి:—నువ్వు నటివేషమునేసి నాకు రావలసిన యాభై రూపాయలున్న బొత్రయ్యసెట్టినుంచి లాగవలె నను కొన్నావా? పో, యిక్కడనుంచి పో!

2-నటి:—ఓసీ చిగురుబోడీ! ఎక్కడనుంచి వస్తివే?

1-నటి:—నేను చిగురుబోడినైతే, నీవు పూబోడివి. పో, ప్రక్కకు పో! నాథా (అని ఒక చేయిపట్టుకొంటు న్నాడు.)

2 నటి:—నాథా! నా ప్రాణనాథా! నా ప్రాణకాంతా! నా ప్రాణప్రియా! దానిని నీ చెయ్యిపట్టుకోనివ్వకు (అని తానొక చేయి పట్టుకొంటాడు.)

1-నటి:—నా పంచప్రాణమా! నా వెండికొండా! నా బంగారు ముద్దా! నా వజ్రపు తునకా! దానిని తాక బోకు. అది బూతకి.

2-నటి:—నా మంగళసూత్రధారీ! నా యింద్రుడా! నా చంద్రుడా! నా మన్మథుడా!

పాట (డయలాగు)

1-నటి:—దొంగమాటలాడకే – దోసకారి లచ్చి!

2-నటి:—పిచ్చిమాటలాడకే – పీసనారి బుచ్చి!

సూత్ర:—నన్ను వదలండర్రా!

1-నటి:—చెల్ మోహనరంగా! (పాట)

2-నటి:—ఛప్ నోర్ముయ్ గంగా! (పాట)

సూత్ర:—ఏమి దారిరా, దేవుడా!

1-నటి:—కోప-మా-ఆ-ఆ-ఆ (పాట)

2-నటి:—తాప-మా-ఆ-ఆ-ఆ (పాట)

సూత్ర:—ఏమిటర్రా ఈ అల్లరి?

(పాట)

1-నటి:—పాప-అల్లరి-కృష్ణా-రారా!

(ఒక ప్రక్కకు లాగుతాడు.)

2-నటి:—నా-కల్లరి-కృష్ణా-రారా!

(మరొక ప్రక్కకు లాగుతాడు.)

సూత్ర:—మీ రీనాటకము రసాభాసచేయదలచినారు. సెట్టిని పిలుస్తాను.—బొర్రయ్యసెట్టీ! బొర్రయ్యసెట్టీ!

(సెట్టి ప్రవేశము.)

సెట్టి:—అయ్యో నా కర్మమా! సాములోళ్లందరూ నాటకం సూడాల నొచ్చి కూకుంటే, ఏంటయ్యా యీం గలాటా అంతాను?

సూత్ర:—ఏమి సెట్టీ! నాకు సూత్రధారుడి పార్టు కంట్రాక్టు కిచ్చినావా, లేదా?

సెట్టి:—అవును, నీకిచ్చినాను.—ఈళ్లెవరు?

1-నటి:—నన్ను సుబ్బులక్ష్మి పంపింది. ఆయమ్మకు తలనొప్పిగా ఉందట. పాపం ఈరాత్రి నాటకం రసాభాస అవుతుందని తనకు బదులుగా నన్ను వేషం వేయమన్నది.

2-నటి:—ఉత్తమాట. ఆయమ్మ నన్నే పంపింది. అది నా మేనత్తకూతురు.

1-నటి:—వీనివి దొంగమాటలు. కావలిస్తే ఆయమ్మ నుంచి జాబు తీసుకొస్తాను. నేను నటీపాట్టు ఒక్క అక్షరమైనా తప్పకుండా కంఠపాఠం చేసుకొని, అద్దం ముందర అభినయంచేసి చూచుకొని వచ్చినాను.—చూడు, సెట్టీ, నా వేషం బాగులేదూ?

సెట్టి:—యిగ్గెట్టుకోలేదే!

1-నటి:—సెట్టీ, నీకు మడ్డు మూటకట్టుకోవడమే కాని, వేషం సంగతేమి తెలుస్తుంది? ఏక్షను అంటే ఏమిటో తెలుసునా? "Showing the mirror to nature" అంటే "ప్రకృతికి అద్దం చూపడం."

2-నటి:—సెట్టికి.

1-నటి:—నోరుముయ్! షేక్స్పియరేమన్నాడో తెలుసునా?

2-నటి:—కాళిదాసేమన్నాడో తెలుసునా?

1-నటి:—ఏమన్నాడురా?

2-నటి:—షేక్స్పియరేమన్నాడురా?

సెట్టి:—నా తలకాయన్నాడు. మీరంతా నా కొంపముంచు తున్నారు. అయ్యోయి, పోయి మీ మేనత్తకూతురు సుబ్బులచ్చిమిని తోలుకొని రావయ్యా! నాకారులో బిరీనిపో. సాములోళ్లందరూ కనిపెట్టుకొని ఉన్నారని సెప్పు.

1-నటి:—సెట్టీ, వాడు పోయేది కారు'లో' కాదు. కారు'తో' నే. నేనే పోయి పిలుచుకొస్తాను.

2-నటి:—నువ్వుపోతే ఈలోగా నేను నటీపార్టు చేసేస్తాను.

సెట్టి:—నీ పున్నెమయ్యోని, నన్ను గబ్బులేపకండి, నాయనా, బతిమిలాడుకొంటాను

1-నటి:—అయితే నా యాభై రూపాయలు నాకిచ్చెయ్, నేను పోతాను.

2-నటి:—నా యాభై రూపాయలున్నూ నాకిచ్చెయ్, నేనున్ను పోతాను.

సూత్ర:—సెట్టీ, ఇటువంటి నాటకం నే నెక్కడా చూడలేదు. నావంటి లోకప్రఖ్యాతిగల నటకుని కీనాటికి నీమాటలు విని ఒప్పుకొన్నందుకు బాగానే అయింది. నాయాభై రూపాయలకు మరి నూరు రూపాయలు కలిపియిస్తేనే కాని యీస్టేజిమీదనుంచి దిగేదిలేదు. ఏమి చేస్తావో చేసుకో!

సెట్టి:—ఏంటయ్యా, నన్ను బెదరిస్తారు? నేను మీ కేమిన్ని యిస్తానని ఒప్పుకోలేదు. మీకొక దమ్మిడీకూడా ఇవ్వ నక్కరలేదు.

1-నటి:—ఓహో! ఈదినము వసూలయిన రెండువేల రూపా యలు ఈ సభ్యులకు వాపసిచ్చి మళ్లీ పో.

2-నటి:—వీళ్ల దుడ్డు వీళ్ల కివ్వకపోతే సాగగొట్టి వసూలు చేసుకొంటారు.

సూత్ర:—ఒరేయ్, సెట్టి దుడ్డుపెట్టెతో తొమ్మిది గంటల బండికి పరారి అయ్యేటట్టు కనబడుతున్నాడు. వీనిని కదలనివ్వకూడదు. పట్టుకోండి. (పట్టుకొంటారు.)

సెట్టి:—ఇదిగో మీపున్నె ముంటాది. యిడిసిపెట్టండల్లో! నా నేడకిపోతాను? ఈనాటక మైపోనీయండి. ఎవరిదు డ్డా ళ్లకి దమ్మిడీలతోకూడా యిచ్చివం పేస్తాను. నేరకపోయి యీకంట్రాక్టొప్పుకొన్నాను. దండగ! దండగ! శుద్ధ దండగ! దీనితో దివాలా! అయ్యల్లో! దివాలా!

1-నటి:—సెట్టీ నిజంగా చెప్పు. ఈదినం ఎంత కలెక్ట యింది?

సెట్టి:—ఏమయింది! యాడీ?—నూరు రూపాయలుకూడా నిండా లేదు.

2-నటి:—హాలంతా యిట్లా కిలకిలలాడిపోతూ ఉంటే, నూరు రూపాయలూ! ఎవరికి చెప్తావు, సెట్టీ!

సెట్టి:—బూదేవి సాచ్చి! నీసాచ్చి! ఈడ నున్నోళ్ల సాచ్చి! నా జందెప్పోగు సాచ్చి!

సూత్ర:—ఈమాటలన్నీ కట్టిపెట్టు. నాపార్టు కావచ్చింది. ముందు దుడ్డక్కడ పెట్టు. మమ్మల్ని ముందుగా పంపిం చెయ్యి.

(కవి ప్రవేశము.)

కవి:—ఏమండీ, సెట్టిగారూ, బాగా చేసినారులెండి. నాటక మారంభించక ముందే నా కివ్వవలసిన రు 500 లు పంపుతానని చెప్పి, నా వ్రాతప్రతి నాటక మిప్పించు కొని, అప్పుడే ఆడించేస్తున్నారే! ఏదీ దుడ్డు!

సెట్టి:—ఓ-హో-హో-హో-హో! కయిగారు! కయిగారు! ఎన్నడు రాక?—దయసెయ్యాలి. దయసెయ్యాలి,— ఏదిరా సీనిగా, కుర్చీ తెచ్చెయ్యిరా, అయ్యగారికి!

కవి:—నాకు కుర్చీ వద్దు, మిర్చీ వద్దు. దుడ్డు ముందర పెట్టి మాట్లాడు:

సెట్టి:—ఎంతమా టెంతమాట!—ఏదిరా కుర్చీ! ఒరే, అని మిగా! కొండిగా! సిత్రిగా! సీనిగా!—ఒక్కడూ పల కడే! నానే తెచ్చుకోవాల! (పోబోతున్నాడు.)

సూత్ర:—సెట్టీ, ఈయ నెక్కువేమిటీ, అంటాను? ఈయన కొక్కడికే కుర్చీవేసి కూర్చోబెట్టి, మమ్మల్ని నిలబడ మన్నావా?

కవి:—ఇదేమిన్నీ బాగులేదు. వీళ్లెవ్వరికిన్ని మర్యాదా, మంటి గడ్డా తెలియదు. ఈ నాటకము వ్రాయడమే నా తెలివి తక్కువ.

1-నటి:—నిజం!

2-నటి:—ని-జంగా నిజం!

సూత్ర:—తప్పకుండా నిజం!

కవి:—ఏహేఁ! నే నెవరినో తెలుసునా?

1-నటి:—ఎవరు మహానుభావా, తామూ?

కవి:- మాయింటిపేరు నిమిషకవివారు.

1-నటి:—మా యింటిపేరు శతఘంటకవివారు.

2-నటి:—దిట్టకవివారు, మా తాతగారి యింటిపేరు.

సూత్ర:—మా బావగారింటిపేరు వార్తకవివారు.

సెట్టి:—మేలే! యేటో అనుకొన్నాను! ఒక్క కవీసరుడే అనుకుంటే, నలుగురు కుటుంబ కవులే సిక్కినారు!

కవి:—నా ప్రఖ్యాతినిగురించి మీరు వినే ఉంటారు.

1-నటి—కాస్త సెలవియ్యాలి.

కవి:—నా బిరుదాలు వినండి. 'కింకవీంద్ర ఘటాపంచానన, ఆశుకవిచక్రవర్తి, అష్టావధానోద్ధారప్పిండ, పిండీకృతా ఖండగోధూమధామ, ధామాయితభూమ, భూమా యితకామ, కామాయిత...

2-నటి:—సోమ!

1-నటి:—బలే! బలే!

సెట్టి:—అబ్బో! యీయప్ప కెన్ని మాటలొచ్చునో!

కవి:—సెట్టీ, వీండ్లకింకా నా తడాఖా తెలియదు.—ఇదేమిటి, నన్నింకా నిలబెట్టే మాట్లాడిస్తున్నావు? కుర్చీ తీసుకొని రా!

సెట్టి:—సిత్తం, సిత్తం. యిదిగో, నానే తెచ్చి యేస్తా. నా బుద్ధి బూరెలు తినా! పెద్దోళ్లను నిలబెట్టే ఉంచినాను. (పోబోతున్నాడు.)

1-నటి:—ఏమ్ సెట్టీ! కదిలినావంటే మంచిపని కాదు.—ఉండు, ఎవరి కుర్చీ వాళ్లమే తెచ్చి వేసుకొంటాము.

సెట్టి:—ఎంతమా టెంతమాట? మీ నలుగురికీ నాలుగు కురిసీలు తెస్తాను.

కవి:—వద్దు, సెట్టీ, వద్దు. వీళ్ళతో సమానంగా నేను కూర్చొనేది లేదు. నా ప్రభావం నీకుగాని వీళ్ళకుగాని తెలియదు.

2-నటి:—కొంచెము సెలవియ్యాలి.

కవి:—నేను—

"గడియకు నూరుపద్దెములు గంటములేక రచింతు..."

సెట్టి:—అబ్బా!

కవి:—"తిట్టగాఁ దొడఁగితినా పఠాలుమని

తూలిపడుం గులశైలరాజమున్"

సెట్టి:—ఒయ్యల్లో! ఏమిదారి? (బెదరి 1-నటిని కౌఁగిలించు కొంటాడు. తక్కినవాళ్ళందరున్ను కవిని కౌగిలించు కొంటారు.)

కవి:—సెట్టీ, భయపడకు.—

"విడిచి యనుగ్రహించి నిరుపేద ధనాధిపతుల్యుఁ జేతు..."

సెట్టి:—అట్లా అనుగ్రహించాలి! ఏదిరా. వక్కాకూ?— సామీ, ఒక బీడీ సేవిస్తారా, ఒక్కబీడీ ?

కవి:—ఏమి సెట్టీ! నన్ను నలుగురిముందరా బీడీ కాల్చ మంటావా ?

సూత్ర:—అహ్హాహ్హా! నిత్యాగ్నిహోత్రులు. క్షణక్షణ పీతానేక ధూమపత్రానవరతపరిమళితవక్త్రగర్తులు.

కవి:—సెట్టీ! నేను,

బెడిదమువాడ నారసకవీంద్రుఁడ .."

1-నటి:—"నా కొకరుండు సాటియే."

కవి:—భాయీ, నా పద్యం నీ కెట్లావచ్చిందోయ్?

1-నటి:—దీనికే 'టెలిపెతీ' అంటారు. అంటే 'తెలివిడి'అన్న మాట. 'తెలివిడి'కి 'టెలిపెతీ' అనేది ఇంగ్లీషు ఎంగిలి తద్భవం.

కవి:—దానిమాట కేమిగాని, సెట్టీ, నాకు రు 500 లు ముందుగా ఇచ్చి పంపించు.

సూత్ర:—ముందర నాది పెట్టి.....

1-నటి:—నాదో ?

2-నటి:—నాది మాత్రమో ! సాగదీసి పుచ్చుకొంటాను.

సెట్టి:—యిదిగో నామాట యినండి. ఈనాటకం కానివ్వండి. అణాపైసలతో ఇచ్చేస్తాను.

సూత్ర:—నాటక మెట్లా ఆడతారు? మరి బళ్లారినించి ఆచార్లు రాలేదే!

సెట్టి—నొస్తా డీబండిలో. మీరు కానిస్తా ఉండండి.

1-నటి:—మరి బెజవాడనుంచి మనోహరి వచ్చిందా ?

సెట్టి:—రానని టెలిగ్రా మిచ్చింది. మన వూళ్లోని చకోరా చ్చిని పిలుసుకొచ్చినాను.

2-నటి:—చీపికళ్ల చకోరాక్షినా ?

సెట్టి:—కళ్లెవరు సూస్తారు పోవయ్యా, వొళ్లుదిట్టంగావుంటే?

సూత్ర:—వేషంమీద ఆడిఫెక్టు అంతగా కనబడదులే. మేక ప్పులో అది కనబడకుండా చేసెయ్యొచ్చును.

2-నటి:—కళ్లేనా ?

సూత్ర:—కాదోయ్, డిఫెక్టూ !

1-నటి:—కళ్లు చికిలించడంకూడా ఇప్పటి సినీమా తెరల మీద ఒక అందముగానే ఏర్పడింది. ఏక్షనులో అమరి పోతుంది.

సెట్టి:—ఘటోత్కచుడి యేషానికే యేం చెయ్యాలా అను కొంటున్నాను.

సూత్ర:—ఈనాటకములో ఘటోత్కచుడి వేష మెందుకు సెట్టీ?

సెట్టి:—అక్కర్లేదూ? అయితే బతికినాము, గొగ్గయ్య కొప్ప కొన్న నూరు రూపాయలు మిగుల్తాయి. ఆడు రాక పోవడమే మేలాయె.

1-నటి:—అయితే ఈదినం నాటకము కథేమిటి సెట్టీ?

సెట్టి:—అదేటో, నాకేటి తెలుస్తాది? కయిగారు రాసిందే! కయిగారూ, సెప్పండీకథా!

కవి:—నేను వ్రాసి నీకిచ్చివేసినానుకానూ? ఆకథే.

సెట్టి:—మీరిచ్చినదానిలో పత్రాలెవరిమానవాండ్లు చింపేసు కొని, ఎవరి పార్టు వాండ్లు తీసుకొన్నారు. నాదగ్గ రెక్కడ ఉంది?

1-నటి:—అయితే ఆచార్ల పార్టు బళ్లారిలోను, మనోహరిపార్టు బెజవాడలోను ఉన్నవన్నమాట!

సూత్ర:—బాగుంది. నాటక మెట్లా ఆడడం?

సెట్టి:—ఏమండీ, కయిగారూ, ఇప్పుడొకటిరాసి ఇయ్యలేరూ?—వో! అయ్యోర్లు తల్సుకొంటే అదెంత పని? ఆళ్లింటి పేరే నిమిసకవోళ్లు—కూకోండి, కయిూసరులూ, కాయి తాలూ, ఊటకలం తెప్పిస్తా.

కవి:—నేను కలముతో వ్రాయడము పెట్టుకోలేదు. నేను సుకవి శిఖామణిని. రాసుకోండి, చెప్తాను—కాని, ఈకొత్త నాటకానికి వెయ్యి రూపాయలు పుచ్చుకొంటాను.

సెట్టి:—వో! దుడ్డుమాటకేం? దుడ్డు మనల్ని గడించిందా? మనం దుడ్డుని గడించినామా? దుడ్డేమి శాశ్వతం? ఈనాడుంటే రేపు పోతాది. కీర్తి ప్రధానం.

సూత్ర:—అవును. Art for Arts sake అన్నారు. అంటే 'కళ కోసం కళ' అన్నమాట.

కవి:—అది పూర్వకాలపు మాట. ఇప్పుడు Art for Science sake, Science for Art sake. అంటే 'శాస్త్రం కోసం కళ, కళకోసం శాస్త్రం.''

1-నటి:—అది కాదయ్యా, కవీశ్వరుడా! Art and Science for Artha sake, అంటే కళాశాస్త్రం డబ్బుకోసమన్న మాట. కాళిదా సేమన్నాడు?—

'వాగర్థా వివసంపృక్తౌ పార్వతీ పరమేశ్వరౌ' వాక్= వాక్కున్నూ (కళాస్థానములో వాక్కుంది గనక కళయున్ను); అర్థౌ=ఇది ద్వివచనంలో ఉన్నది గనుక 'దానికి రెండింతలు దుడ్డున్ను'; ఇవ=వలె; సంపృక్తౌ= రెండు లంకెలు వేయబడిఉన్న; పార్వతీ=కొండజాతి స్త్రీకిన్ని; పరమ=పరమానందాయ శిష్యులైన; ఈశ్వరౌ= దాని యిద్దరు భర్తలున్ను'' అన్నమాట. అంటే, ఒకానొక నాటకములో లంబాడీ ఆడదాని వేషం

వెయ్యాలనుకో. దాని వెనుక ననుసరించి ఇద్దరు మగా
ళ్లుంటారు చూచినావుకాదూ? వాళ్లెందుకుంటూ రను
కొన్నావ్? దుడ్డుకోసం. దీని ఫలితార్థ మేమిటంటే,
కళకిన్ని కళకిన్ని లంకె; శాస్త్రానికిన్ని శాస్త్రానికిన్ని లంకె;
కళకూ శాస్త్రానికి లంకె; శాస్త్రానికీ కళకూ లంకె; ఇంత
కూ దుడ్డు ప్రధానము. "ప్రయోజన మనుద్దిశ్య
నమందోపి ప్రవర్తతే."

2-నటి:—అది కాదోయ్, ముద్దబ్బాయ్! దానర్థం. "పార్వతీ
ప్లస్ పరమేశ్వరా" అని పదచ్ఛేదం చెయ్యకూడదు
తెలుసునా? ఎందుచేతనంటే, నాటకములో ఒక ఫీమేలు
కేరెక్టరుకు ఇద్దరు పురుష కేరెక్టర్లు చొప్పున ఉండ
వలసి వస్తుంది. నావంటి కొంత మందికి ఫీమేలు కేరెక్ట
రెదురుగా ఉంటే కొలాప్సు. అందుచేత, దాని పద
విభాగం "పార్వతీప ప్లస్ రమేశ్వరా" అప్పు డిద్దరున్ను
మగ కేరెక్టర్లే అవుతారు.

కవి:—అట్లనడం తప్పు. అప్పుడు 'పార్వతి', 'రమ' ఇద్దరు
ఫీ-మేళ్లుతప్పరు. ఇక వారిద్దరికిన్ని ఇద్దరు ఫీ-మేళ్లు
కావలసొస్తుంది.

సెట్టి:—మీరేటేటో మాట్లాడుతొంటావున్నారు. నాకే...
మీ తెలవటం లేదు. ఇప్పటి నాటకం మాటేటీ—
అంటాను.

సూత్ర:—సెట్టప్పా! ఇదంతా నాటకంకాదూ? ఇంకేమి
నాటకం కావాలి?

సెట్టి:—అది కాదయ్యా !–ఇక దేమిటీ'–అంటాను.

1-నటి:—నువ్వు మాదుడ్డివ్వకపోతే కొత్త కథ ఉండనేడుంది.

సెట్టి.—అది కాదప్పా!–కథ–మరే కథాడితే బాగుంటాదీ! అంటాను.

2-నటి:—(సెట్టితో వేరే) సెట్టీ, ఎందుకీ వేషాలు వేస్తావు? ఒకమాట చెప్తాను విను. ఈకవిని పంపించివెయ్యి నీకు వీళ్లెవరివల్లా ఒక్క చిక్కున్ను రాకుండా, నాటకము మేమే రచించుకొని, మేమే ఆడుతాము. మాకెక్కువ ఇవ్వ నక్కరలేదు. ఇంతకుముందు నిర్ణయించుకొన్నదే చాలును.

సెట్టి:—రచ్చించినావు, బాబయ్యా! మరి, కానివ్వండి.

2-నటి:—మరి కవిని తీసుకపో.

సెట్టి:—కయిగారూ, ఒక్కమాట !

కవి:—ఏమిటది ?

సెట్టి:—రండి. కారెక్కి, యింటికెళ్లి, ఒక్క కప్పు కాఫీ పుచ్చుకోనొత్తురుగాని. (చెవిలో) ఈళ్లతో మనకేటి? ఇంటికాడ మీా యవ్వారం కుదిర్చేస్తాను రండి.

కవి:—పదయితే పోదాము. (పోతారు.)

సూత్ర:—సెట్టిని విడిచిపెట్టేశారేమర్రా!

1-నటి:—వాడెక్కడికి పోతాడు? మనము నాటకమాడేసి, వానివద్దనుంచి దుడ్డు సాగదీసి పుచ్చుకొందాము.

సూత్ర:—అయితే యేమి నాటక మాడదాము?

1-నటి:—అదొక ఆశ్చర్య ప్రహసనము, ముందుగా సభ్యులకు తెలుస్తే రక్తి కట్టదు. వాళ్లే కనుక్కోవాలి. కథ సైడ్ కర్టెనులో చెప్తానులే. ప్రస్తావన ముగించివేదాము ముందుగా.—ఒరే, నువ్వు ముందుపో. మేమిప్పుడే వచ్చేస్తాము.

2-నటి:—(నిష్క్రమిస్తాడు.)

సూత్ర:—నటీ, ఈసభ్యులందరును మన నాటకమును దిలకింప నెంత కుతూహలులై యున్నారో చూచితివే? ఈసభను వర్ణింపుము.

1-నటి:—

''పురసౌఖ్యమునకుఁ గాఁపుర సౌఖ్యమునుజేర్చి
యరయుచుండెడు కౌన్సిలరుగణంబు,
డాక్టర్లు, పేర్పడ్డ యేక్టర్లు, గుడ్ బెని-
ఫేక్టర్లు, మాంచి కంట్రాక్టరులును,
బ్రీఫు బ్రీఫులతోడ బ్రీజీగ మాటాడు
అసమానులైన లాయరు తతులును,
టోకు చిల్లరలందు టోకరా తినబోక
ధనవంతులైన వైశ్యనివహంబు,
అయ్యవార్లును, పిల్లలు, ఆడవాళ్లు
అందరునుచేరి యీసభ యందగించి
ఇంద్రసభనైన యల్ల యుపేంద్రసభను
కూడ మించుచు నున్నదీ కువలయమున.

సూత్ర:—నటీ, చాల చక్కగ వర్ణించితివి సుమా! పద్యము నెవరు వ్రాసినారో కాని అక్షర లక్ష లివ్వవచ్చును. కవితా ద్రాక్షారసమున నీగాన సోడా నీరమును కలిపి సేవించిన యీ సభాసదు లెట్లు మైకము క్రమ్మి మైమరచియున్నారో చూడుము.

1-నటి:—చూచితిని గాని, నాథా, మీ రిపు డాడబోవు నాటకరాజమునకు నామం బెయ్యదియో!

సూత్ర:—ఓసీ వేలా! తినబోవు కూరకు రుచి యడుగనేల? అదిగో మన గంగాధరుడు కూర్చుండి ప్రవేశింపబోవుచున్నాడు. రమ్ము, మనమును మన పాత్రములను ధరించి వత్తము.

1.నటి:—చిత్తము.

(నిష్క్రాన్తి)

తెర

---

## రంగము ద్వితీయము

(రాజు, రాణి, మంత్రి, సేనానాయకుడు. రాజు ఎత్తు సింహాసనముమీద కూర్చుంటాడు. ఎడమ ప్రక్క కుర్చీమీద రాణి. కుడిప్రక్క కుర్చీలో మంత్రి. సేనానాయకుడు నిలబడి ఉంటాడు. సేనానాయకుని చేతిలో అట్టకత్తి.)

రాజు:—మంత్రి-చం-ద్ర-మా!

మంత్రి:—చి-త్త-ము, రా-జేం-ద్ర-మా!

రాజు:—సే-నా-నా-య-క-శ్రే-ష్ఠా!

సేనా:—హా-జర్! నృ-ప-కు-ం-జ-ర-గ-రి-ష్ఠా!

రాజు:—రాణీ-సాహిబా!

రాణి:—మీ ప్రక్కనే ఉన్నాను, రాయసాహేబా!

రాజు:—మంత్రీ, నిన్నెందుకు మొదట పిలిచినానో తెలిసినదా?

మంత్రి:—దేవరవారి హృదయ మత్యంత గాధము, మూరురాయరగండా!

రాజు:—నీవు బుద్ధిని బృహస్పతివి. నూపున శుక్రాచార్యుడవు. కార్యనిర్వహణమున కామందకివి. చమత్కారమున ఛాణక్యుడవు. తెలిసినదా?

మంత్రి:—తెలియకేమి, స్వామీ! నేనంతటివాడనే. అందుకు సందేహమా? తమరు కాబట్టి పోల్చుకున్నారు, రాజాధిరాజ పరమేశ్వరా!

రాజు:—తరువాత నిన్నెందుకు పిలిచినానో గ్రహించుకొన్నావా, సైన్యాధ్యక్షా!

సేనా:—దేవరవారి ఆలోచన అగమ్యగోచరము గదా, పరరాయ భయంకరా!

రాజు:—చెప్తాను వినవలయును. వినుచున్నవాడవా?

సేనా:—బుద్ధి, బుద్ధి, దేవరా!

రాజు:—నీవు బ్రహ్మాండభాండ నిర్భేదన పటిష్ఠుడవు. నిర్వీర్య శత్రు సంహరణ కార్యైకనిష్ఠుడవు. అపారరాపారావకారాశినా చరచరిష్ఠుడవు. బోధపడినదా?

సేనా:—నేను చిన్ననాడు హైస్కూళ్లలో చదువుకోలేదు, రాజమార్తాండా! కొంచెము కొంచెముగా చెప్పితే బోధపరుచుకొంటాను.

రాజు:—అయిన వినుము రా.—నీవు "బ్రహ్మాండ"—

సేనా:—నేను పెద్ద కోడిగ్రుడ్డుని.

రాజు:—సెబాస్! నీ తెలివితేటలకు మెచ్చుకొన్నాము.—ఇక, 'భాండ—నిర్.'

సేనా:—'భాండనీర్' అంటే 'కుండలోని నీరు' అని దేవరవారి అభిప్రాయమై ఉంటుంది.

రాజు:—(నీర్) కాదురా, మూర్ఖా! 'నిర్'—దీని కర్థము చెప్పకపోతే నీతల తీయించివేస్తాము.

సేనా:—(తనలో) ఏమిదారి! నేను చదువుకొన్న అమరములో గాని, ఆంధ్రములోగాని ఈపదములేదే! ఎట్లు తప్పించుకో గలనురా, దేవుడా! నా గురువుమీద తోసేస్తాను. (ప్రకాశముగా) మహారాజాధిరాజ రాజభాస్కరా! చండ, ప్రచండ, ప్రప్రచండ, మార్తాండతేజా! దాని కర్థము తెలియని తప్పు నాదికాదు నాకు చదువు చెప్పిన అయ్యవారు నా కా శబ్దము చెప్పలేదు. అది ఆయన తప్పు.

రాజు:—ఆఁ! ఆఁ! చెప్పలేదూ? చెప్పలేదూ? మన రాజ్యములో విద్యావిధానము సరియైన పద్ధతులమీద జరుగు చుండలేదన్నమాట.—సరే, మంత్రి వృషభా, నీ గురువయినా దాని అర్థము నీకు చెప్పినాడా, లేదా?

మంత్రి:—లేదు, మహాప్రభో!

రాజు:—ఏమీ? చెప్పలేదా? ఇక నీ బడులనన్నిటినీ తల క్రిందు చేయవలెను. అంటే, క్రింది క్లాసు అయ్యవార్లను మీది క్లాసులకు, మీది అయ్యవార్లను క్రింది తరగతులకు మార్చివేయాలి. మంత్రీ, అట్లా సర్క్యులరు వెంటనే పంపుమని విద్యామంత్రితో చెప్పు. ఇప్పుడు మన విద్యామంత్రి ఎవడురా?

మంత్రి:—నాతమ్ముడే, దేవరా!

రాజు:—అయితే, మంత్రీ, ఆశబ్దమున కర్థమును నీగురువు నీ వడుగుతే చెప్పలేదా ? అడుగకుండానే చెప్పలేదా ?

మంత్రి:—అడుగకుండానే చెప్పలేదు, దేవరా ?

రాజు:—అది నీ గురువు తప్పుకాదు. నీ గురువు నడుగకపోవడం నీదే తప్పు, సర్క్యులరు పంపవద్దు. అది రద్దు! నీవిప్పు డర్థం చెప్పకపోతే నీ తలకాయ సఫా!

మంత్రి:—(వడకుతూ) దేవాధిదేవా! పొరపాటు, పొరపాటు! అడుగుతేనే చెప్పలేదు.

రాజు:—అడుగుతే చెప్పలేదూ ? చెప్పినదాకా ఎందు కడిగినావు కావు ? నీకు శిరచ్ఛేదం !

మంత్రి:—మళ్లీ అడుగవలె ననుకొనేసరికి బొంత్రయ్యసెట్టివచ్చి గురువుగారిని బాకీ నిలవేసినాడు, దేవరా! దానితో ఆయన యింటిలోనికిపోయి గడియవేసుకొన్నాడు,

రాజు:—బొంత్రయ్యసెట్టికి పొగరెక్కినది. అయ్యవార్ల జీతములు మూడునెలల కొకసారి వస్తాయని తెలుసుకోలేకపోయినాడో! ఇంతలో బాకీకోసము నిలవేయవలెనో! నీశబ్దాని కర్థం చెప్పకుండా యెందు కడ్డము వచ్చినాడు? వానికి ఉరిశిక్ష!—ఎవడురా, సేవకా!

సేవకుడు:—(ప్రవేశించి) (తనలో) నాటకం వ్రాయించుకొని నాకు సేవకుని పార్టిచ్చినారు. కానీ చెప్తాను. (ప్రకా) చిత్తం, దేవరా! బుద్ధి, బుద్ధి!

రాజు:—బొ ర్రయ్య సెట్టి నున్నపాటుగా లాగుకొని రా!

సేవ:—చి త్తం, దేవరా! (పోతాడు.)

రాజు: రాణీమణీ! నీకయినా తెలుసునా 'భాండనిర్' అంటే అర్థం? తెలుసునని ఒప్పుకో. లేకపోతే నీకు ఉప్పుపాతర!

రాణి:—(లేచి ఎదురుగా నిలుచుండి) ప్రియా, తమకు తెలిసినది నాకు తెలియకుండా ఉంటుందా? నేను మీ అర్ధాంగిని కానా? నాకు తెలియకపోతే, తమకున్ను తెలియదన్నమాటేకదా!

రాజు:—(రాణితో వేరే) అవును. నీవూరకో. నీవు చెప్ప నక్కరలేదు:—(ప్రకాశము) ఉండండి, బొర్రయ్యసెట్టి వచ్చిన తరువాత ఈవిచారణ చేస్తాము.—అయితే, మిమ్మల్ని ఇంతటి కఠినపరీక్ష ఎందుకు చేస్తున్నామో మీకందరికీ తెలిసినదా?

మంత్రి:—తెలిసింది, మహాప్రభో!

సేనా:—గొ త్తయింది, దేవా!

రాణి:—'జానీమః, ప్రియకాంత!

రాజు:—బలే, బలే, నాభార్యారత్నము సంస్కృతములో ఎంతటి విదుషీమణి! ఏదీ! ఏదీ! మళ్లీ అను! వీళ్లందరికీ సిగ్గొచ్చిన ట్లను!

రాణి:—జానామి.

రాజు:—ఇందాకా 'జానీమః' అని, ఇప్పుడు 'జానామి' అని ఎందుకన్నావు ?

రాణి:—మరేమీ లేదు. 'జానీమః' అని తమ యెదుట బహువచనములో గౌరవించుకోనడము తగదని ఏకవచనములోనికి మార్చినాను.

రాజు:—సరే, సమాధానము సరిపోయినది.—మరి, 'ప్రాణకాంత!' అనలేదే! నాకు కోపం వస్తున్నది (కోపము నటించును) అను, 'ప్రాణకాంత' అను.

రాణి:—అట్లా పిలుస్తే, ఇందరిముందర తాము సిగ్గుపడతారేమో అని భయము వేస్తున్నది.

రాజు:—నాకా సిగ్గు? లేదు, లేదు.—పిలు, భయములేదు. మనము లోకమున కంతటికి ఆదర్శప్రాయులము కావలె నని మరచిపోతివా ?

రాణి:—ప్రాణకాంతా, ప్రాణప్రియా, ప్రాణవల్లభా, ప్రాణాంతకా!

రాజు:—మొదటి మూడింటికిన్ని సంతోషించినాము (సంతోషము నటిస్తాడు.) నాలుగో దానికిమాత్రం—హుం!—కోపంవచ్చిపడె! (కోపము నటిస్తాడు.)

రాణి:—(వణకుతూ)ఏల, నాముద్దుల మగడుగారూ, ఇంతకోపం?

రాజు:—నన్ను 'ప్రాణాంతకా!' అని పిలుస్తావా?

రాణి:—అయ్యో! ఇందుకేనా అంతకోపం? 'ప్రాణాంతకా' అంటే 'ప్రాణంపోయేవరకున్ను మగడా! అన్నమాట.

రాజు:—శహబాస్! నీ సమయస్ఫూర్తికి మెచ్చుకొన్నాము.

రాణి:—ఇదిగాక, 'అంతక' అంటే 'యముడు' అన్నమాట. మీశత్రువులకు మీరు యములుకారా, నాబంగారు నాయకా!

రాజు:—అవును. యముడనే. నాకోపమంతా పోయినది.

రాణి:—యముడు సమవర్తి. తమవలెనే స్వపక్షపరపక్ష నిర్ధూమధాముడు.

రాజు:—అవునూ! అవునూ! సెహబాస్! సెహబాస్! ఓరీ మంత్రీ, ఓరీ సేనానాయకా, మీరావలకు పొండి. నా రాణిని ముద్దుపెట్టుకోవలెను.

రాణి:—వలదు, నాథా, ఇప్పుడు వలదు.

రాజు:—సరే.—మరి మిమ్మల్నెందు కింతటి కఠినపరీక్ష చేసి నానో తెలుసుకొన్నారు గదా! ఎందుకో చెప్పండి.- మొదట—మంత్రి!

మంత్రి:—దేవరవారు పరీక్ష చేయకపోతే, మేము మామా పనులలో జాగ్రత్తగా ఉన్నామో లేమో తెలియదు.

రాజు:—నీ సమాధానం మూడో రకంగా ఉంది.—సేనా నాయకా! నీవు!

సేనా:—పరీక్ష అంటేనే పరీక్ష. అందుకోసమే పరీక్ష.

రాజు.—నాకుకూడా అర్థముకాకుండా ప్రత్యుత్తర మిచ్చి నావు. నువ్వు రెండో తరగతి. నిన్ను మంత్రిని చేసి

నాము. మంత్రిని సేనానాయకునిగా మార్చినాము. మంత్రీ, నీవక్కడకుపోయి నిలబడు. సువ్విక్కడ మంత్రి కుర్చీలో కూర్చో.

సేనా:— మరి డ్రెస్సులో?

రాజు:—ఇప్పు డాలస్య మవుతుంది. తరువాత మార్చుకో వచ్చును. ఇప్పటికి తలపాగాలు మాత్రం మార్చుకోండి.—ప్రియే, నీవు చెప్పు.

రాణి:—'హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపివా.'

అంటే బంగారముయొక్క నాణెము అగ్గిలో వేస్తే తెలుస్తుంది. మీ పరీక్ష అగ్గివంటిది. మీ పరీక్షలో అందరున్ను మలమల మాడిపోతారు.

రాజు:—(సింహాసనముమీదనుంచి దిగుతూ) బలే, బలే! వహవ్వా, వహవ్వా. తెలివి తేటలలో నన్ను మించిపోయినావు. ఇకనుంచిన్ని నీవే రాజువి. నేనే రాణీనై నీ పాదారవిందములు సేవిస్తూ ఉంటాను. పో, సింహాసనముమీద కూర్చో. నేనీ కుర్చీలో కూర్చుంటాను.

రాణి:—వలదు, దేవా, ఇప్పుడు వలదు.

రాజు:—ఇక్కడకువచ్చి కూర్చుంటావా? దరువులు కావలెనా?

రాణి:—వలదు! వలదు!

రాజు:—ఏమి వలదు ? దరువులు వలదా? నీ విక్కడ కూర్చో వలదా ?

రాణి:—రెండున్ను వలదు. అందుకోసమే 'వలదు, వలదు' అని రెండుసార్లన్నాను.

రాజు:—మెచ్చుకొన్నాను. అందుకోసమే సింహాసనముమీద నీవు కూర్చోనితీరవలెను. (చేయిపట్టుకొని కూర్చో పెట్టుతాడు.)—ఇప్పుడు వినండి మిమ్మెల్నెందుకు పరీక్ష చేసినానో !

మంత్రి:—అనుగ్రహము !

సేనా:—అపగ్రహము కాదోయ్, పప్పా! అగ్రహం.

రాజు:—మూర్ఖుడా! అనుగ్రహమే. పో! నీ స్థానములో నీవు నిలుచో. మంత్రీ ! నీ పదవిని నీ కిచ్చివేస్తున్నాము. రా, కుర్చీలో కూర్చో.

రాణి:—ఇప్పుడు రాజును నేనుకాని, నీవు కావు. ఎక్కడివా రక్కడనే ఉండండి!—ప్రియురాలా, నీవు నిలబడి మాట్లాడవలెను. తెలిసినదా ?

రాజు:—(నిలబడి) చిత్తము, ప్రాణనాథా !

రాణి:—సరే, కూర్చుండుము.

రాజు:—ఏమి చేయను ! అట్లే (కుర్చీమీద కూర్చుండ బోతాడు.)

రాణి:—కుర్చీమీద కాదు;—నేలమీద.

రాజు:—నేలమీాదనా ?... నేలమీాదనా ?

రాణి:—అ...వు...ను!

రాజు:—సరే (కూర్చుంటాడు.)

రాణి:—నిలుచో!

రాజు:—చిత్తం! (నిలుచుంటాడు) మగనిమాట వినకపోతే తప్పుతుందా ?

రాణి:—పరుగెత్తు!

రాజు:—పరుగెత్తలేనే!...పొట్ట పెరిగినదే!

రాణి:—ప...రు...గె...త్తు!

రాజు:—చిత్తం! (పరుగెత్తుతూ ఆయాసపడతాడు.)

రాణి:—సరే. పాపం! అలసిపోయినావు. ఇక అశ్వత్థ ప్రదక్షిణాలు చేయ నక్కరలేదు. రా, కుర్చీలో కూర్చో, నారీరత్నమా!

రాజు:—(ఆయాసముతో) అనుగ్రహం, ప్రా...ణ... నా...థా!—అమ్మా! అ...య్యో!

రాణి:—నా ముద్దులగుమ్మా, మమ్మెందుకు పరీక్షించితివి ?

రాజు:—మరేమీా లేదు,...మరేమీా లేదు.—మీాకు ప్రసిద్ధి రావలెనని.

రాణి·—ప్రసిద్ధి యెట్లా వస్తుంది ?

రాజు:—చిన్నప్పుడు నా గురువు నేర్పినాడుగదా.

"ఘటం భింద్యాత్, పటం ఛింద్యాత్,
కుర్యాద్వా గార్దభస్వరం,
యేన కేనా ప్యుపాయేన
ప్రసిద్ధః పురుషోభవేత్." అని.

రాణి:—సరే. అయితే, మంత్రీ! నీవు ఘటమును భిందింపగలవా?

రాజు:—అంటే, 'కుండ పగులగొట్టగలవా?' అన్నమాట.

మంత్రి:—ఓ! ఒక్క కర్రదెబ్బతో.

రాణి:—సరే, నీవు ప్రసిద్ధుడ వైపోయినావు. ఈప్రక్కకు రా.—'ఏమి సేనానాయకా! నీవు పటమును ఛిందింపగలవా?

సేనా:—ఓ! అదెంతపని? ఒకపటం తీసుకొనిరండి. నా సామర్థ్యం చూతురుగాని.

రాజు:—పటమంటే చిత్రపటం కాదోయ్, మూర్ఖా! 'బట్ట' అన్నమాట.

రాణి:—నువ్వు అతనిని 'మూర్ఖా' అనకూడదు. నేననవలెను. చెంపలు వాయించుకో.

రాజు:—అపరాధం, అపరాధం (చెంపలువాయించుకొంటాడు)

సేనా:—చిత్రపటమయినా సరే, ఛిద్రపటమయినా సరే, ఎంతసేపు చింపడం? ఇదిగో, ఈతలపాగా చింపనా?

మంత్రి:—అది నా తలపాగా. ఇదిగో నీది. ఇదిచింపు.

రాణి:—సరే. చింప నక్కర లేదు. నీవంతటివాడ వౌదువు. నీవున్ను ప్రసిద్ధుడవయి పోయినావు. రా, ఈ ప్రక్కకు. ...ఇంక, నా నవ్వులరాణీ! నీవు గార్దభస్వరమును కరింపగలవా ?

రాజు:—మే మెందుకు చేయవలెను? మేము నిన్ను పరీక్ష చేసినాము గాని, నీవు మమ్ము పరీక్షించలేదే!

రాణి:—ముందుగా—'నేను...మిమ్ము...పరీక్ష చేసినాను... తాము...నన్ను...పరీక్షించలేదు' అను.

రాజు:—మరచినాను. దేవరవారు క్షమించవలెను. 'నేను నిన్ను...'

రాణి:—'మి...మ్ము!

రాజు:—'నేను మిమ్ము పరీక్షచేసినాము...'

రాణి:—'చేసినాను...'

రాజు:—అవును. చేసినాను. తామే గార్దభస్వరము చేయవలెను.

రాణి:—నీ వేమన్నావు? 'ప్రసిద్ధః పురుషః' అన్నావా, లేదా?

రాజు:—అవును, అన్నాను. తా మిప్పుడు రాజుగారు కాబట్టి పురుషులు. తామే చేయవలెను.

రాణి:—అయితే, నీ వాడదాన నంటావా ?

రాజు.—ఆహా! నిజముగా ఆడదాననే.

రాణి:—అయితే, వంటచేయగలవా ?

రాజు.—ఏమిచేయను? చే...స్తా...ను!

రాణి.—అంట్లు తోమగలవా?

రాజు.—తప్పుతుందా? తో...ము...తా...ను.

రాణి.—గర్భము-దాల్చ-గలవా?

రాజు.—ఇదిగో! (పొట్టచూపుతాడు.)

రాణి.—పిల్లలను కనగలవా?

రాజు.—నారాజా! రక్షించాలి! అదిమాత్రం నావల్లకాదు.

రాణి.—అయితే, నీ వాడదానవుకావు. పురుషుడవు.

రాజు.—ఏమిచేయను?—అవును, పురుషుడనే.

రాణి.—అందుచేత చెయ్యి, గార్దభస్వరం చెయ్యి!

రాజు:—మరి వాళ్లిద్దరున్ను చేయగలరా?

మంత్రి:—నే నెందుకు చెయ్యాలి? నేను కుండ పగులగొట్టి ప్రసిద్ధుడ నయినాను.

సేనా:—నేను బట్టచించి ప్రసిద్ధుడ నయినాను.

రాణి:—ఇక నీవంతు మిగిలినది. చెయ్యి, వేగం చెయ్యి, గార్దభస్వరం!

రాజు:—నాకురాదే! నేను నేర్చుకోలేదే!

రాణి:—అయితే నీవు ప్రసిద్ధ పురుషుడవు కావు. నీకు విడాకు లిచ్చేస్తాను:

రాజు:—వద్దు! వద్దు!! చేస్తాను.

రాణి:—చెయ్యి!

రాజు:—(అర్చును.)

రాణి:—బలే! బలే! నీవే రాజు కావడానికి యోగ్యుడవుఁరమ్ము. ఈ సింహాసనముపై కూర్చుండుము.

రాజు:—నా కక్కర లేదు. నే నక్కడ కూర్చోను.

రాణి:—ఏమి ?

రాజు:—అక్కడ కూర్చుంటే నిజముగానే మగవాడ నౌతాను. అప్పుడు క్షణక్షణానికీ గార్దభస్వరం చేస్తూ ఉండాలి.

రాణి:—భయము లేదు. ఎల్లప్పుడున్ను అట్లా చేయ నక్కర లేదు. ఒకప్పుడు కుండ పగులగొట్టుతూ ఉండు. ఒక ప్పుడు బట్టలు చింపుతూ ఉండు. కోపం వచ్చినప్పుడు మాత్రం గార్దభస్వరం చేస్తే చాలును.

రాజు:—ఉహ్హూఁ! నేను కూర్చోను.

రాణి:—వచ్చి కూర్చుంటావా? విడాకు లిచ్చేసేదా?

రాజు:—కూర్చుంటాను...కూర్చుంటాను. (కూర్చుంటాడు. రాణి తన కుర్చీమీదికి వచ్చేస్తుంది.)

రాణి—ప్రాణనాథా! తమవంటి ప్రఖ్యాతమగనిని బడసిన నా భాగ్యమే భాగ్యము.

మంత్రి:—మహారాజాధిరాజరాజపరమేశ్వరా పరాక్! త్రిలో కాక్రాంతయశస్సాంద్రా, పరాక్! భూలోకదేవేంద్రా! పరాక్!

సేనా:—భూనభోంతరవ్యాప్తగర్దభధ్వాన గడగడాయమాన దిగ్గజేంద్రా! పరాక్! రాజ్ఞీకృతపరాభవానంతర పున స్సంస్థాపిత సింహాసనప్రతిష్ఠా, పరాక్!

(సేవకుడు ప్రవేశము.)

సేవ:—దేవరా, బుద్ధి, బుద్ధి! బొర్రయ్యసెట్టిని తీసుకొచ్చి నాము.

రాజు:—వేగము ప్రవేశపెట్టుము.

సేవ:—బుద్ధి, బుద్ధి, దేవరా! (పోతాడు.)

రాజు:—ఒరే మంత్రీ, నాకు నూరు రూపాయలు.

మంత్రి:—నాకున్ను అంతే.

సేనా:—నాకు మాత్రం?

రాజు:—సరే, అట్లాగే కానీ, నీకున్ను నూరు. రాణికి నూరు. సేవకుడు కవిగారు, వాడు నాటకము వ్రాసి యేడిసిన దేముంది? వానికి ఇరవై యైదు చాలవూ?

రాణి:—చాలులే.

మంత్రి:—పోనీలే, పాపం. మరి ఇరవై అయిదు పారేదాము.

రాజు:—కానీలే. బిర్రగా కూర్చోండి.

(సేవకుడు బొర్రయ్యసెట్టితో ప్రవేశము.)

బొర్రయ్య:—(తనలో) ఏ-టిదీ? ఆడుతూ, ఆడుతూ, నాటకం లోనికి నన్నీడ్చుకొచ్చినారు? నన్నుకూడా ఆడమం టారో, ఏటో! రైలెక్కి దాటిపోదా మనుకొంటే, టైము దాటిపోయింది. ఈళ్లకి చిక్కిపోయినాను. కానీ లే. నే నేషమేసినందుకు నావొంతు నేనున్ను తీసు కొంటాను.—కాని, ఈళ్ల వాళకంచూస్తే దొమ్మి చేసి నాదుడ్డు పెట్టె లాగుకొనేటట్టుంది. ఈ జవానుచేతికిచ్చి

ఇంటికి నాపెళ్లానికి పంపించేస్తాను. దీనిలో ఉన్నవన్నీ నోక్లే. పెట్టె బరువులేదు. ఇందులో దుడ్డుందని ఆడు పోల్చుకోలేడు.—(ప్రకాశముగా, ఓ యప్పో!

సేవ:—ఏమి, సెట్టప్పా?

బొర్రయ్య:—ఇలా ఈ పక్కకిరా. సూడీ! ఈ చేతిపెట్టెలో ధర్మవరం పట్టుసీర ఉన్నాది. మనోహర్ వొస్తే ఆ యమ్మకి బగుమానం సెయ్యాలనుకొన్నాను పోనీ, నా పెళ్లానికయినా యిస్తాను. సూడీ. ఈపెట్టె తీసుకపోయి బిరీని యింటికి సేర్చుతావా?

సేవ:—తీసుకపోతానుగాని, దీని బీగమో!

బొర్ర:—బీగమేలలే! నానొచ్చి సీర తీసిస్తానని నా పెళ్లాముతో సెప్పు.

సేవ:—సరే! (పెట్టెపట్టుకొనిపోతాడు.)

బొర్ర:—(తనలో) ఈడుపెట్టె కాజెయ్యడుగదా! ఏమో, దేవరే దిక్కు. (ప్రకాశముగా) ఏమి, దేవరా, ఏమి సెలవు?

రాజు:—సెట్టీ! నీకు శి-ర-శ్ఛే-దం!

బొర్ర:—ఆఁ!...ఆఁ! నాకా?—ఏల?

రాజు:—ఎందుకో పోల్చుకో!

బొర్ర:—అదెందుకో! నానేమి సేసినాను, మహారాజా!

రాణి:—త...ప్ప...దు!

బ్రా:—అమ్మయ్యగారుకూడా అట్లాగే అంటారే! అమ్మయ్యా! నానేమి తప్పున్ను సెయ్యలే దమ్మయ్యా!

మంత్రి:—ఇదేమి నాటకము వేషమనుకొన్నావా? సేనానాయకా! వీనిని పట్టుకొనుము.

బ్రా:—దేవరా, ఏటో సెప్పండ్రి, దేవరా! (తనలో) పెట్టె పంపించేసినాను. ఈళ్లు నన్ను పట్టుకోని ఏమి సేస్తారు?

రాజు:—శి...ర...శ్ఛే...దం!

రాణి:—అ...వు...ను!

బ్రా:—అదుగో, మళ్లీ అదేమాట! తన్పేదో సెప్పనిదీ తల తీసేస్తారా? ఇదేమి రాజ్జెమురా, అబ్బల్లా!

రాజు:—మంత్రీ! నీవు చెప్పుము వీని అపరాధ మేమో!

మంత్రి:—ఏమి బ్రాహ్మయ్యా! నేను పదేండ్ల క్రిందట నా గురువుగారివద్ద చదువుకొంటూ ఉండేవాడనా, లేదా?

బ్రా:—అవును, సదువుకొనేవోడివి. సదువుకోకుండానే ఇంత గొప్ప ఉద్యోగం ఎట్లా సంపాదించినావు మరి?

మంత్రి:—చిత్తగించాలి, మహారాజా! ఒప్పుకొన్నాడు.

బ్రా:—ఏ టొప్పుకొన్నాను?

సేనా:—ఒప్పుకొన్నావు!

బొ౦ర్ర:—ఏం టొప్పుకొన్నానూ? అంటూ.

రాణి:—మంత్రి తన గురువుగారివద్ద చదువుకొన్నాడు అని ఒప్పుకొన్నావు. అందుచేత నీకు శి...ర...శ్చే...దం!

బొ౦ర్ర:—మంత్రి సదువుకొంటే, నాకు శిరచ్ఛేదమా? నా కొంప తీసేసినావుగదయ్యా! నువ్వెందుకు సదువుకొన్నావయ్యా, నా కుత్తుకమీాదికి?

సేనా:—అందుకే. రా, మెడవంచు.

బొ౦ర్ర:—అయ్యల్లో! అమ్మల్లో!...(నవ్వుతూ) కదేటో సెప్పండయ్యా! ఏటీ నాటకమంతా?

రాజు:—ఇది కథకాదు. నాటకమున్ను కాదు. నిజం!

బొ౦ర్ర:—నిజమూా! అయితే తలతీసేస్తారూ!

రాణి:—త...ప్పు...దు!

బొ౦ర్ర:—అమ్మయ్యా! నువ్వు బిడ్డల్ని కనుకో్కలేదూ? నేను నీ బిడ్డడిని. నువ్వయినా సెప్పమ్మయ్యా, నా నేమి తప్పు సేసినానో!

మంత్రి:—నేను నా గురువుగారి నొకమాట కర్థమడుగుతూ ఉండగా నీవక్కడికి వచ్చినావా, లేదా?

బొ౦ర్ర:—వొచ్చుంటాను...అయితే?

మంత్రి:—మహారాజా! అదికూడా ఒప్పుకొన్నాడు.

రాజు:—వీని తలకాయ సఫా! ఏమి సేనానాయకా, చూస్తూ ఊరకొంటూ వేమి ?

సేనా:—సెట్టీ, రా, ఇక్కడ నిలుచో.

బొర్ర:—ఒయ్యమ్మో! ఒయ్యబ్బో!...నాను మీ అయ్యోరింటికొస్తే నా తలెందుకు తీసెయ్యాల ?

సేనా:—అదే నీవు చేసిన తప్పు!

బొర్ర:—ఆడకి నా బాకీ అడగడానికి పోవడం తప్పా ?

మంత్రి:—మహాప్రభో! ఆమాటకూడా తన నోటనే ఒప్పుకొన్నాడు.

రాజు:—శి...ర...శ్ఛే...దం !

రాణి:—త...ప్పు...దు!

బొర్ర:—సంగతేటో సెప్పండ్రి, దేవరా!

మంత్రి:—ఏమిటూ, గురువుగారు నా కామాట కర్థం చెప్పకుండా వెళ్లిపోయినారు.

బొర్ర:—అయితే ?

మంత్రి.—రాజుగారు నన్నామాటకే అర్థం చెప్పమన్నారు.

బొర్ర.—సెప్పమంటే ?

మంత్రి.—నేను చెప్పలేకపోయినాను.

బొర్ర:—సెప్పలేకపోతే ?

మంత్రి:—నాకు శిరశ్ఛేద మన్నారు.

బ్రా:—ధర్మప్రభువులు! మాంచి పని సేసినారు. మరిరా, ఇక్కడికిరా, నిలుసో! (సేనానాయకునితో) ఏమయ్యా, సూస్తావేం? అయ్యో, నామెత్రిమొగమా! మేగం కానీవయ్యా!

మంత్రి:—అది కాదోయ్, బసప్పా! గురువుగారు నాకు చెప్ప లేదు గనుక నేను చెప్పలేకపోయినాను.

బ్రా:—అవునూ!

మంత్రి:—నువ్వు గురువుగారిని బాకీ అడిగినావు గనుక ఆయన నాకు చెప్పలేదు.

బ్రా:—అయితే?

మంత్రి:—నీకు శిర శ్ఛేదం.

బ్రా:—అవునా, దేవరా?

రాజు:—అ. . .వు. . .ను!

బ్రా:—ఏమి మాటకు, దేవరా, మీారర్థ మడిగినది?

మంత్రి:—నువ్వర్థం చెప్తావా?

బ్రా:—కానీ, నానర్థం సెప్తాను, నువ్వర్థం సెప్పు. లాబ నష్టాలు చెరిసగం పంచుకొందాము.

రాజు:—చెప్తావా?

బ్రా:—సూస్తాను, సెప్పగల్నో. లేనో.

రాణి:—చెప్పకపోతే శి–ర–శ్ఛే–దం!

బొం:—(తనలో) ఈయనది సగం, నాది సగం, (ప్రకాశము) సెప్పండి, దేవరా!

రాజు:—'భాం...డ...నిర్! చెప్పు, అర్థం చెప్పు.

బొం:—బం...

మంత్రి:—'బం' కాదు. 'భాం'

బొం:—డా...డా...డా...డా. ఆఁ! తరువాత!

సేనా:—నిర్!

బొం:—'నిరూ!'...ఆఁ! ఉండండి...తెల్సిపోయె!

రాజు:—(తనలో) తెలిసిందంటున్నాడు. నిజంగా అర్థం చెప్పే స్తాడో ఏమిటో. చూదాము. (ప్రకాశము) ఏమిటీ, సెప్టీ. దాని అర్థం?

బొం:—ఆయన అర్థం ఆయన్ని చెప్పమనండి. నా అర్థం నాను సెప్తాను.

మంత్రి:—నేను చెప్తానని ఒప్పుకోలేదు.

బొం:—ఓహో! నా నర్థం సెప్పాలో! లాభం పంపకానికి సుప్పు సిద్ధమో!

రాజు:—చె...ప్పు!

బొం:—ఏదయితే మీకేల?...మీకు తెల్సునా దానర్థం? మీరు సెప్పలేకపోతే మీకే శిరచ్ఛేదం. ఏం, ఒప్పుకొన్నట్టేనా?

రాజు:—మా ఒప్పుదల మాటకేమి? నువ్వు చెప్పు. దోషివి నీవు కాని, మేము కాము.

బ్రా:—ఒయ్యొబ్బ!...ఏడ నేర్చుకొన్నారయ్యా, ఈ నాటకం?...ఏమయ్యోవ్, సుబ్బారావుగా! అనుమే శప్పా! సీనప్పా!...ఇక చాలుచేసండి నాటకం. మంగళం పాడండి.

రాజు:—మంగళం?...ఎవరికి? నీకు మంగళం కాకుండా నాటక మెట్లా అవుతుంది?

బ్రా:—ఓ! నాకే! మీరు పాడకపోతే నానే పాడతాను.

సువ్వి-రామ-చంద్ర-సువ్వి, సువ్వి-కోస-లేంద్ర-సువ్వి
సువ్వి-జాన-కమ్మ-సువ్వి, సువ్వి-మంగళం!
సువ్వి-బ్రా...ర్రయ్య-సెట్టి, సువ్వి-నా-దుడ్డు-పెట్టె
సువ్వి-కయికి-నామ-మెట్టి, సువ్వి-మంగళం!

ఒరే సోమన్నా! లాగరా, తెరా!

రాజు:—లాగుతాడూ! ఎవడూ లాగేవాడు?...మంత్రి చంద్రమా! పోనీ, పాపము, బ్రార్రయ్యసెట్టిని చంపడ మెందుకు? వీనికి రు 500 లు దండన విధించుచున్నాము.

మంత్రి:—సెట్టీ, చక్రవర్తిగా రనుగ్రహించినారు. వెంటనే చెల్లింపుము. లేకున్న నీకు శిక్ష తప్పదు.

బ్రా:—రండయ్యా, మీ దుడ్డెడకిపోతాది?—లాగురా, తెరా!

రాణి:—పట్టుకోండి సెట్టిని.

మంత్రి:—పట్టుకోండి!

బ్రా:—శా! యీడ నిందరిముందర యేటీ రసాభాస? రండి, యింటికాడ సూసుకొందాము.

రాజు:—ఇక్కడనే పంపకం కావాలి. నీయింటికి వచ్చేదానికి మాకేమీ గ్రహచారం పట్టలేదు. అదుగో, నీ చంక లోని దుడ్డుసంచితీసి ఇవతలపెట్టు.

బ్రా:—నాదగ్గ ర్నిక్కడలేదంటే నమ్మండి. ఇదిగో, నీతోడు! నీ తలమీద సెయ్యేసి ప్రమాణం సేస్తాను.

రాణి:—నీ చంకకింద నదేమిటి?

బ్రా:—ఇదుగో, ఉత్తగుడ్డ (తీసి దులుపుతున్నాడు.

మంత్రి:—దుడ్డేమి చేసినావు?

బ్రా:—ఇప్పుడే మీ యెదురుగానే జవానుచేతికిచ్చి యింటికి పంపేసినానుకానా?

రాజు:—ఆఁ!...ఆఁ! మా కొంప తీసినావు. నీకొంప తీసు కొన్నావు.

బ్రా:—ఏల?

మంత్రి:—ఆ జవా నెవడనుకొన్నావు?

బ్రా:—ఎవడాడు?

మంత్రి:—కవి.

బ్రా:—ఆఁ! హాఁ! కయ్యా! కయ్యా! కొంప నిజంగా మునిగి పోయె! మునిగిపోయ్యా! ఓయమ్మల్లో! ఓయబ్బల్లో!! (చతికిల పడతాడు.)